# అథ పంచాశత్తమో%ధ్యాయః

# దుర్గా చరితము

మునయ ఊచుః |

శ్రోతుకామా వయం సర్వే దుర్గాచరితమన్వహమ్ | అపరం చ మహాప్రాజ్ఞ తత్త్వం వర్ణయ నో%ద్భుతమ్ || 1

శృణ్వతాం త్వన్ముఖాంభోజాత్క థా నానా సుధోపమాః | న తృప్యతి మనో%స్మాకం సూత సర్వార్థ విత్తమ || 2

మునులు ఇట్లు పలికిరి -

ఓ మహాబుద్ధిశాలీ ! మేమందరము ప్రతిదినము దుర్గాచరితమును వినగోరుచున్నాము. మాకు మరియొక అద్భుతమగు తత్త్వమును వర్ణించి చెప్పుము (1). ఓ సూతా ! సర్వవిషయములు తెలిసిన వారిలో నీవు శ్రేష్ఠుడవు. నీ ముఖపద్మమునుండి అమృతము వంటి అనేక గాథలను వినుచున్న మా మనస్సులకు తృప్తి కలుగుట లేదు (2).

సూత ఉవాచ |

దుర్గమః ప్రథితో నామ్నా రురుపుత్రో మహాబలః | బ్రహ్మణో వరదానేన చతస్రో% లభత శ్రుతీః || 3

దేవాజేయబలం చాపి సంప్రాప్య జగతీతలే | కరోతి స్మ బహూన్ పాపాన్ దివి దేవాశ్చకంపిరే || 4

సర్వా నష్టేషు వేదేషు క్రియా నష్టా బభూవ హ | బ్రాహ్మణాశ్చ దురాచారా బభూవుస్సురాస్తదా || 5

న దానం న తపో%త్యుగ్రం న యాగో హవనం న హి | అనావృష్టిస్తతో జాతా పృథివ్యాం శతవార్షికీ || 6

హాహాకారో మహానాసీత్త్రిషు లోకేషు దుఃఖితాః | అభవంశ్చ జనాస్సర్వే క్షుత్తృడ్భ్యాం పీడితా భృశమ్ || 7

సరితస్సాగరాశ్చైవ వాపీకూపసరాంసి చ | నిర్జలా అభవన్ సర్వే సంశుష్కా వృక్షవీరుధః || 8

తతో దృష్ట్వా మహాదుఃఖం ప్రజానాం దీనచేతసామ్ | త్రిదశాశ్శరణం యాతా యోగమాయాం మహేశ్వరీమ్ || 9

సూతుడిట్లు పలికెను -

దుర్గముడు అను పేరుతో ప్రసిద్ధిని గాంచిన మహాబలశాలియగు రురుపుత్రుడు బ్రహ్మ ఇచ్చిన వరముల ప్రభావముచే నాలుగు వేదములను పొందెను (3). ఆతడు దేవతలచే జయింప శక్యము కాని బలమును కూడ పొంది భూమండలమునందు అనేక పాపములను చేయుచుండగా, స్వర్గములో దేవతలు వణికిపోయిరి (4). వేదములు అదృశ్యము కాగా వేదోక్త కర్మలన్నియు నష్టమయ్యెను. అపుడు బ్రాహ్మణులు మరియు దేవతలు దురాచారపరాయణులైరి (5). దానము గాని, మిక్కిలి తీవ్రమగు తపస్సు గాని, యాగము గాని, హోమము గాని లేకుండెను. దాని వలన భూలోకములో వంద సంవత్సరములు అనావృష్టి కలిగెను (6). పెద్ద హాహాకారము బయలు దేరెను. ముల్లోకములోని ప్రాణులు అందరు ఆకలిదప్పికలచే మిక్కుటమగు పీడను పొంది దుఃఖించుచుండిరి (7). నదులు, సముద్రములు, దిగుడు బావులు, నూతులు, సరస్సులు, అన్నీ ఎండిపోయెను. చెట్లు, లతలు పూర్తిగా వాడిపోయెను (8). అపుడు దైన్యముతో నిండిన మనస్సులు గల జనుల మహాదుఃఖమును చూచి దేవతలు యోగమాయాస్వరూపిణి యగు మహేశ్వరిని శరణు జొచ్చిరి (9).

దేవా ఊచుః |

రక్ష రక్ష మహామాయే స్వకీయాస్సకలాః ప్రజాః | కోపం సంహర నూనం త్వం లోకా నంక్ష్యంతి చాన్యథా || 10

కథా శుంభో హతో దైత్యో నిశుంభశ్చ మహాబలః | ధూమ్రక్షశ్చండముండౌ చ రక్తబీజో మహాబలః || 11

స మధుః కైటభో దైత్యా మహిషాసుర ఏవ చ | తథైవాముం కృపాసింధో దీనబంధో జహి ద్రుతమ్ || 12

అపరాధో భవత్యేవ బాలాకానాం పదే పదే | సహతే కో జనో లోకే కేవలం మాతరం వినా || 13

యదా యదాభవద్దుఃఖం దేవానాం బ్రహ్మణాం తథా | తదా తదావతీర్యాశు కురుషే సుఖినో జనాన్ || 14

ఇతి విక్లబితం తేషాం సమాకర్ణ్య కృపామయీ | అనంతాక్షమయం రూపం దర్శయామాస సాంప్రతమ్ || 15

ధనుర్బాణౌ తథా పద్మనానామూలఫలనాని చ | చతుర్భిర్దధతీ హస్తైః ప్రసన్నముఖపంకజా || 16

తతో దృష్ట్వా ప్రజాస్తప్తాః కరుణాపూరితేక్షణా | రురోద నవ ఘస్రాణి నవరాత్రీస్సమాకులా || 17

మోచయామాస దృష్టిభ్యో వారిధారాస్సహస్రశః | తాభిః ప్రతర్పితా లోకా ఔషధ్యస్సకలా అపి || 18

అగాధతో యాస్సరితో బభూవుస్సాగరా అపి | రురుహుర్ధరణీ పృష్ఠే శాకమూల ఫలాని చ || 19

వితతార కరస్థాని సుమనోభ్యః ఫలాని చ | గోభ్యస్తృణాని రమ్యాణి తథాన్యేభ్యో యథార్హతః || 20

సంతుష్టా అభవన్ సర్వే సదేవద్విజమానుషాః | తతో జగాద సా దేవీ కిమన్యత్కరవాణి వః || 21

దేవతలు ఇట్లు పలికిరి -

ఓ మహామాయా ! రక్షించుము, రక్షించుము. ప్రజలందరు నీవారే. కోపమును ఉపసంహరించుము. నీవు అట్లు చేయనిచో, లోకములు నశించుట నిశ్చయము (10). శుంభుడనే రాక్షసుడు సంహరింపబడి గాథగా మిగిలినాడు. మహాబలుడగు నిశుంభుడు, ధూమ్రాక్షుడు, చుండుడు, ముండుడు, మహాబలుడగు రక్తబీజుడు (11), మధువు, కైటభాసురుడు మరియు మహిషాసురుడు కూడ సంహరింపబడినారు. అదే విధముగా, వీనిని కూడ శీఘ్రముగా సంహరించుము. ఓ దయానిధీ ! నీవు దీనులకు బంధురాలవు (12). పిల్లలు ప్రతి అడుగునందు అపరాధములను చేయుచునే ఉందురు. కాని ఆ అపరాధములను లోకములో తల్లిని మినహాయిస్తే, మరెవ్వరు సహించెదరు? (13)దేవతలకు మరియు బ్రాహ్మణులకు ఏయే కాలములలో దుఃఖము కలిగినదో, ఆయా కాలములలో నీవు వెంటనే అవతరించి జనులకు సుఖమును కలిగించెదవు (14). ఈ విధమగు వారి గోడును విని దయాస్వరూపురాలగు ఉమ వెంటనే అనంతమగు నేత్రములతో నిండియున్న రూపమును చూపించెను (15). వికసించిన పద్మము వంటి ముఖము గల ఆమె నాల్గు చేతులతో ధనస్సును, బాణములను, పద్మమును, అనేకములగు దుంపలను మరియు ఫలములను పట్టుకొని యుండెను (16). దుఃఖితులై యున్న తన సంతానమును గాంచి, అపుడు దయతో నిండియున్న కన్నులు గల ఉమ దుఃఖితురాలై తొమ్మిది పగళ్లు, తొమ్మిది రాత్రులు రోదించెను (17). ఆమె కన్నుల నుండి అసంఖ్యాకములగు కన్నీటిధారలను విడిచిపెట్టెను. ఆ ధారలచే జనులు వృక్ష లతాదులు అన్నీ తడిసి తృప్తిని బడసినవి (18). నదులు మరియు సముద్రములు నీటితో నిండి అగాధములైనవి. భూతలమునందు కూరలు, దుంపలు, ఫలములు పెరిగినవి (19). ఆమె దేవతలకు తన చేతిలోని ఫలములను, గోవులకు అందమగు గడ్డిని, మరియు

ఇతరులకు వారి అర్హతలను బట్టి పదార్థములను పంచిపెట్టెను (20). దేవతలు, బ్రాహ్మణులు, మరియు ఇతరమానవులు సంతోషమును పొందిరి. అపుడా దేవి, ' నేను మీకు ఇంకనూ ఏమి చేయవలెను ?' అని పలికెను (21).

సమేత్యోచుస్తదా దేవా భవత్యా తోషితా జనాః | వేదాన్ దేహి కృపాం కృత్వా దుర్గమేణ సమాహృతాన్ || 22

తథాస్త్వితి ప్రభాష్యాహ యాత యాత నిజాలయమ్ | వితరిష్యామి వో వేదానచిరేణైవ కాలతః || 23

తతఃప్రముదితా దేవాస్స్వం స్వం ధామ సమాయయుః | సుప్రణమ్య జగద్యోనిం ఫుల్లేందీవరలోచనామ్ || 24

తతః కోలాహలో జాతో దివి భూమ్యంతరిక్షకే | తచ్ఛ్రుత్వా రౌరవస్సద్యో న్యరుణత్సర్వతః పురీమ్ || 25

తతస్తేజోమయం చక్రం విధాయ పరితశ్శివా | రక్షణార్థం దేవతానాం స్వయం తస్మాద్బహిర్గతా || 26

తతస్సమభవద్యుద్ధం దేవ్యా దైత్యస్య చో భయోః | వవృషుస్సమరే బాణాన్నిశితాన్ కంకటచ్ఛిదః || 27

ఏతస్మిన్నంతరే తస్యాశ్శరీరాద్రమ్యమూర్తయః | కాలీ తారాచ్ఛిన్నమస్తా శ్రీ విద్యా భువనేశ్వరీ || 28

భైరవీ బగలా ధూమ్రా శ్రీ మత్త్రిపురసుందరీ | మాతంగీ చ మహావిద్యా నిర్గతా దశ సాయుధాః || 29

అసంఖ్యాతాస్తతో జాతా మాతరో దివ్యమూర్తయః | చంద్ర లేఖాధరాస్సర్వా స్సర్వా విద్యుత్సమప్రభాః || 30

తతో మాతృగణైర్యుద్ధం ప్రావర్తత భయంకరమ్ | రౌరవీయం హతం తాభిర్దలమక్షౌహిణీశతమ్ || 31

జఘాన సా తదా దైత్యం దుర్గమం శూలధారయా | పపాత ధరణీ పృష్ఠే ఖాతమూలద్రుమో యథా || 32

అపుడు దేవతలు ఒక చోటకు గుమిగూడి ఇట్లు పలికిరి : నీవు జనులను సంతోషపెట్టినావు. దుర్గముడు పట్టుకొని పోయిన వేదములను దయచేసి ఇమ్ము (22). ఆమె ఇట్లు పలికెను : అటులనే యగుగాక ! మీరు మీ ఇళ్లకు పొండు, పొండు. మీకు అచిరకాలములోననే వేదములను ఇచ్చెదను (23). అపుడు దేవతలు చాల సంతోషించి వికసించిన కలువలవంటి కన్నులు గల, జగత్కారణమగు ఉమాదేవికి చక్కగా ప్రణమిల్లి తమ తమ గృహములకు వెళ్లిరి (24). అపుడు భూమియందు, అంతరిక్షములో మరియు స్వర్గములో కోలాహలము ఏర్పడెను. దానిని విని రురుపుత్రుడగు దుర్గముడు వెంటనే నగరమును అన్నివైపుల నుండియు ముట్టడించెను (25). అపుడు శివాదేవి దేవతల రక్షణ కొరకై తేజోరూపమగు చక్రమును చుట్టూ ఏర్పాటు చేసి, తాను స్వయముగా దానినుండి బయటకు వచ్చెను (26). అపుడు దేవికి ఆ రాక్షసునితో యుద్ధము జరిగెను. వారా యుద్ధములో ఒకరిపై నొకరు కవచములను ఛేదించే వాడి బాణములను వర్షించిరి (27). ఇంతలో ఆమె శరీరమునుండి కాలి, తార, ఛిన్నమస్త, శ్రీ విద్య, భువనేశ్వరి, భైరవి, బగల, ధూమ్ర, శ్రీ మత్త్రిపురసుందరి, మహావిద్యా స్వరూపురాలగు మాతంగీ అనే పది సుందరాకారులగు స్త్రీ మూర్తులు ఆయుధములను ధరించి బయల్వెడలిరి (28, 29). అపుడు దివ్యమూర్తులగు మాతృదేవతలు లెక్కలేనంతమంది ఉదయించిరి. వారందరు చంద్రవంకను దాల్చి మెరుపు తీగతో సమమగు కాంతిని కలిగియుండిరి (30). అపుడు ఆ మాతృగణములతో భయంకరమగు యుద్ధము జరిగెను. దుర్గముని వంద అక్షౌహిణీల సైన్యమును వారు హతమార్చిరి (31). అపుడు ఆ శివాదేవి దుర్గమాసురుని శూలాగ్రముతో కొట్టగా, ఆతడు మొదలు నరికిన చెట్టు వలె నేలగూలెను (32).

ఇత్థం హత్వా తదా దైత్యం దుర్గమాసురనామకమ్ | ఆదాయ చతురో వేదాన్ దదౌ దేవేభ్య ఈశ్వరీ || 33

అస్మదర్థం త్వయా రూపమనంతాక్షిమయం ధృతమ్ | మునయః కీర్తయిష్యంతి శతాక్షీం త్వామతో%ంబికే || 34

ఆత్మదేహ సముద్భూతైశ్శాకైర్లోకా ధృతా యతః | శాకంభరీతి విఖ్యాతం తత్తే నామ భవిష్యతి || 35

దుర్గమాఖ్యో మహాదైత్యో హతో యస్మాత్తతశ్శివే | దుర్గాం భగవతీం భద్రాం వ్యాహరిష్యంతి మానవాః || 36

యోగనిద్రే నమస్తుభ్యం నమస్తే%స్తు మహాబలే | నమో జ్ఞానప్రదే తుభ్యం విశ్వమాత్రే నమో నమః || 37

తత్త్వమస్యాదివాక్యైర్యా బోధ్యతే పరమేశ్వరీ | అనంతకోటి బ్రహ్మాండనాయికాయై నమో నమః || 38

వాఙ్మనః కాయదుష్ప్రాపాం సూర్యచంద్రాగ్నిలోచనామ్ | స్తోతుం న శక్నుమో మాతస్త్వత్ప్రభావాబుధా వయమ్ || 39

మాదృశానమరాన్ దృష్ట్వా కః కుర్యాదీదృశీం దయామ్ | వర్జయిత్వా సురేశానీం శతాక్షీం మాతరం వినా || 40

త్రిలోకీ నాభి భూయేత బాధాభిశ్చ నిరంతరమ్ | ఏవం కార్యస్త్వయా యత్నో%స్మాకం వైరివినాశనమ్ || 41

అపుడీ విధముగా దుర్గమాసురుడనే రాక్షసుని సంహరించి, ఆ ఈశ్వరి నాల్గు వేదములను తీసుకొని వచ్చి దేవతలకు ఇచ్చెను (33). అపుడు దేవతలు ఇట్లు పలికిరి: నీవు మా కొరకై అనంత నేత్రములతో గూడిన రూపమును ధరించితివి. ఓ అంబికా ! కావున నిన్ను మహర్షులు శతాక్షి అని కీర్తించెదరు (34). నీవు నీ దేహము నుండి ఉద్భవించిన శాకములతో జనులను పోషించితివి. కావున నీకు శాకంభరి అనే పేరు లోకప్రసిద్ధిని పొందగలదు (35). ఓ శివాదేవీ !

నీవు దుర్గముడనే గొప్ప రాక్షసుని సంహరించినావు గనుక, మానవులు నిన్ను దుర్గ, భగవతి, భద్ర అను పేర్లతో పిలిచెదరు (36). ఓ యోగనిద్రా ! మహా బలము గలదానా ! జ్ఞానము నిచ్చుదానా ! జగన్మాతవగు నీకు అనేక నమస్కారములు (37). ఓ పరమేశ్వరీ ! తత్త్వమసి (అది నీవే అయి ఉన్నావు) ఇత్యాది మహావాక్యములు నిన్నే బోధించుచున్నవి. అనంతకోటి బ్రహ్మాండములకు అధీశ్వరియగు తల్లికి అనేక నమస్కారములు (38). ఓ తల్లీ ! వాక్కునకు, మనస్సునకు అందనిది, కర్మచే పొంద శక్యము కానిది అగు నీ ప్రభావము మాకు తెలియదు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని నేత్రములుగా గల నిన్ను మేము స్తుతించలేము (39). మా వంటి దేవతలను చూచి, దేవదేవి మరియు శతాక్షి అగు తల్లిని మినహాయిస్తే, ఇట్టి దయను ఎవరు చూపెదరు ? (40) నీవు మా శత్రువులను వినాశనమొనర్చి ముల్లోకములకు ఏ కాలమునందైననూ బాధలు, పరాభవములు లేకుండునట్లు నీవు ఈ తీరున ప్రయత్నమును చేయదగును (41).

దేవ్యువాచ |

వత్సాన్ దృష్ట్వా యథా గావో వ్యగ్రా ధావంతి సత్వరమ్ | తథైవ భవతో దృష్ట్వా ధావామి వ్యాకులా సతీ || 42

మమ యుష్మానపశ్యంత్యా పశ్యంత్యా బాలకానివ | అపి ప్రాణాన్ ప్రయచ్ఛంత్యాః క్షణ ఏకో యుగాయతే || 43

కాపి చింతా న కర్తవ్యా యుష్మాభిర్భక్తి శాలిభిః | భవత్యాం మయి తిష్ఠంత్యాం సంహరంత్యాం నిజాపదః || 44

యథాపూర్వం హతా దైత్యా హనిష్యామి తథా%సురాన్ | సంశయో నాత్ర కర్తవ్యస్సత్యం సత్యం బ్రవీమ్యహమ్ || 45

యదా శుంభో నిశుంభశ్చాపరౌ దైత్యౌ భవిష్యతః | తదాహం నందభార్యాయాం యశోదాయాం యశోమయీ || 46

యోనిజం రూపమాస్థాయ జనిష్యే గోపగోకులే | హనిష్యామ్యసురౌ తన్మాం వ్యాహరిష్యంతి నందజామ్ || 47

భ్రామరం రూపమాస్థాయ వధిష్యామ్యరుణం యతః | భ్రామరీతి చ మాం లోకే కీర్తయిష్యంతి మానవాః || 48

కృత్వా భీమం పునా రూపం రక్షాంస్యత్స్యామ్యహం యదా | భీమా దేవీతి విఖ్యాతం తన్మే నామ భవిష్యతి || 49

యదా యదా%సురోత్థైవం బాధా భువి భవిష్యతి | తదా తదావతీర్యాహం శం కరిష్యామ్యసంశయమ్ || 50

యా శతాక్షీ స్మృతా దేవే సైవ శాకంభరీ మతా | సైవ ప్రకీర్తితా దుర్గా వ్యక్తిరేకైవ త్రిష్వపి || 51

న శతాక్షీసమా కాచిద్దయాలుర్భువి దేవతా | దృష్ట్వా%రుదత్ర్పజాస్తప్తా యా నవాహం మహేశ్వరీ || 52

ఇతి శ్రీ శివమహాపురాణ ఉమాసంహితాయాం దుర్గా చరిత్ర వర్ణనం నామ పంచాశత్తమో%ధ్యాయః (50).

దేవి ఇట్లు పలికెను -

ఆవులు దూడలను చూచి వెంటనే కంగారుగా ఎట్లు పరుగెత్తునో, అదే తీరున నేను మిమ్ములను చూచి కంగారుపడుతూ పరుగెత్తుచుందును (42). మిమ్ములను చిన్న పిల్లలనువలె సాకి మీ కొరకై ప్రాణములనైననూ ఇచ్చే నాకు మీరు కనబడనిచో క్షణము ఒక యుగము వలె నుండును (43). సమర్థురాలనగు నేను మీ పక్షాన నిలబడి మీ ఆపదలను తొలగించుచున్నాను గనుక, భక్తి సంపన్నులగు మీరు ఏ విధమైన చింతకు లోను కావద్దు (44). పూర్వములో నేను రాక్షసులను సంహరించి యుంటిని. భవిష్యత్తులో కూడ రాక్షస సంహారమును చేసెదను. ఈ విషయములో మీరు సందేహమును పెట్టుకొనవద్దు. నేను ముమ్మాటికీ సత్యమును

పలుకుచున్నాను (45). శుంభనిశుంభులనే ఇంకో ఇద్దరు రాక్షసులు ఉదయించగలరు. అపుడు కీర్తిమంతురాలనగు నేను నందుని భార్యయగు యశోదయందు గొల్లపల్లెలో మనుజస్త్రీ రూపమును దాల్చి ఆ రాక్షసులనిద్దరినీ సంహరించెదను. ఆ కారణముగా నాకు నందజ అను పేరు కలుగగలదు (46, 47). నేను తుమ్మెదల రూపమును దాల్చి అరుణుని సంహరించెదను. ఆ కారణముచే లోకములోని మానవులు నన్ను భ్రామరి అని కీర్తించెదరు (48). మరల నేను భయంకరరూపమును దాల్చి రాక్షసులను భక్షించెదను. అపుడు నాకు భీమాదేవి అనే పేరు ప్రసిద్ధము కాగలదు (49). ఈ విధముగా భూలోకములో ఏయే కాలములయందు రాక్షస పీడ ఉద్భవించునో, ఆయా కాలములలో నేను అవతరించి నిస్సందేహముగా సుఖమును కలిగించెదను (50). ఏ దేవి శతాక్షి యనబడునో, ఆమెయే శాకంభరి, ఆమెయే దుర్గ అని కీర్తింపబడుచున్నది. ఈ మూడు నామములు గల వ్యక్తి ఒక్కరే (51). మహేశ్వరియగు శతాక్షి తన సంతానము బాధపడుచుండుటను గాంచి తొమ్మిది రోజులు దుఃఖించినది. ఆమెతో సమానమగు దయ గల దేవత భూలోకములో మరెవ్వరూ లేరు (52).

శ్రీ శివమహాపురాణములోని ఉమా సంహితయందు
దుర్గాచరిత్రవర్ణనము అనే ఏబదియవ అధ్యాయము ముగిసినది
(50).